ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ



# ఆంధ్ర సదుక్తి కర్ణామృతం



కూర్పరులు
యన్. యస్. సుందరేశ్వరరావు
నే. శ్రీ కృష్ణమూర్తి



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

# ముందుమాట

ఎన్నో ఏళ్ళుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వసమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్ద లందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలం నుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వ యుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్ళడం జరిగింది. అట్లా వెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తూ ఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికీ, తద్వారా వివిధ చైతన్య స్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహద కారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు ఆర్ద్రమైన భావసమైక్యతకు ప్రాతిపదికలై తెలుగుజాతిని సమైక్యం చేయగలవనీ, ఆ విధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన, తెలుగు ఉగాది రోజున, ప్రారంభమై ఒక వారం రోజుల పాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు.

ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటం చేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని (మ్యూజియంను) స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజ భూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజుల పాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదం చేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదం చేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకువచ్చిన అకాదమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు
అధ్యక్షులు
ప్రపంచ తెలుగు మహాసభలు

# పరిచయము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగుదేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పముతో 1975వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయేగాక, ప్రపంచములోని వివిధ దేశాలలో నివసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగునటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక ఆహ్వానసంఘము ఏర్పాటైనది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు, విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు దాని కార్యనిర్వాహకాధ్యక్షులు, ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయసంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్ర భాషా, సాహిత్య, కళా, చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వాహణకై 44 మంది సభ్యులుకల ఒక విద్వత్‌సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది ఆ విద్వత్‌సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయారంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య. చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప

వలసినదిగ ప్రపంచ తెలుగుమహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలత కొరకై కృషిచేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆవిధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ **ఆంధ్ర సదుక్తి కర్ణామృతం** అను గ్రంథమును, రచించినవారు యస్. యస్ సుందరేశ్వరరావు, నే. శ్రీ కృష్ణమూర్తి గారు ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతాబద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన శివాజీ ప్రెస్ వారికి మా కృతజ్ఞత.

**దేవులపల్లి రామానుజరావు**
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

హైదరాబాదు
31-3-1975

# ఉపోద్ఘాతము

ఆంధ్రులను గురించి, వారి సాంస్కృతిక జీవన విధానాన్ని గురించి ఆంధ్రేతరులు చెప్పిన ప్రశంసావాక్యాలను (సదుక్తులను) పరి కూర్చిన గ్రంథం ఇది. ఆంధ్రులను గూర్చి ఆంధ్రులే చెప్పుకొన్నవి తమకు తామే పొగడుకొన్నటుల ఉంటాయని వాటిని చేర్చలేదు.

యన్. యస్. సుందరేశ్వరరావు
నే. శ్రీ కృష్ణమూర్తి.

# నేటి ఆంధ్రప్రదేశ్

అవతరణ - నవంబరు 1, 1956.

ఉనికి - 12°'14-19°54' ఉత్తర అక్షాంశాల మధ్య 76°50'-84°50' తూర్పు రేఖాంశాల మధ్య.

వైశాల్యం-2,74,680 చ. కి. మీ.

భారతదేశ వైశాల్యంలో ఆంధ్రప్రదేశ్ వైశాల్యం 8.4%

తూర్పు తీరరేఖ పొడవు-965 కి. మీ.

జిల్లాలు 21-తాలూకాలు 190.

కోస్తా జిల్లాలు 8-తాలూకాలు-76.

1. శ్రీకాకుళం-11. 2. విశాఖ-10, 3. తూర్పుగోదావరి-12.

4. పశ్చిమగోదావరి-8, 5. కృష్ణా-10, 6. గుంటూరు-9,7. ప్రకాశం-8

8. నెల్లూరు-9. —

రాయలసీమ జిల్లాలు-4 తాలూకాలు-42

9. చిత్తూరు-11, 10. కడప-9,11. అనంతపురం-11, 12.కర్నూలు-11

తెలంగాణము-జిల్లాలు 9-తాలూకాలు-72

13 మహబూబ్‌నగర్-12, 14. హైదరాబాద్-8, 15. మెదక్-8,

16. నిజామాబాద్-7, 17. ఆదిలాబాద్-10, 18. కరీంనగర్-7,

19. వరంగల్-6, 20. ఖమ్మం-7, 21. నల్గొండ-7.

జనసంఖ్య - 4,33,94,951. పురుషులు - 2,19,44,826

స్త్రీలు 2,14,50,125.

భారత జనసంఖ్యలో ఆంధ్రజనాభా-7.93%

తూర్పు కనుమల ఎత్తు - 1066 మీటర్లు. = 3500′

నదులు గోదావరి (ఆ. ప్ర.) 720. కి. మీ. పొడవు. కృష్ణా (ఆ. ప్ర.) 720. కి. మీ.

సాగర్యోభూమి - రెండుకోట్ల డెబ్బై తొమ్మిది ఎకరాలు.

---

తా వను వ్యాజహారాం తాన్వః ప్రజాభక్షీష్టేతి
త ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందాః
ముతిబా ఇత్యుదంత్యా బహావో భవన్తి

ఐతరేయ బ్రాహ్మణమ్. VII-3.18. (క్రీ. పూ. 500)

విశ్వామిత్రుడు తన ఆజ్ఞమీరిన ఏబదిమంది కుమారులను ఆర్యభూముల కావల నివసించునట్లు శపించెను. వారే ఆంధ్రులు, పుండ్రులు, శబరులు, పుళిందులు, మూతిబులు అను నామముతో దక్షిణాపథమునకు వచ్చి స్థిరపడిరి.

---

**రామాయణం :**

తతో గోదావరీ రమ్యాం కృష్ణవేణీ మహానదీం
... ... ... ... ... ... ... ... ...
నదీం గోదావరీం చైవ సర్వమేవానుపశ్యతః
తథై వాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళాన్ పాండ్యాన్శ్చ కేరళాన్

రామాయణం కిష్కింధాకాండమ్

రామాయణకాలమునాటికి ఆంధ్రులు ప్రసిద్ధులు. శ్రీరాముడు సౌమిత్రీ సహితుడై విశ్వామిత్రుని యాగరక్షణార్థము కౌశికుని వెంటబోయి మిథిలా నగరముచేరు మార్గమున, భగీరథుడు గంగను భూమికి తెచ్చు సందర్భమున, భరతుడు గిరివ్రజమునుండి అయోధ్యకువచ్చు మార్గమున, రామలక్ష్మణుల దండకారణ్యాగమన సందర్భమున, ఆంధ్రదేశముతోపాటు పలుదేశముల యునికి చెప్పబడినది. కాని అందు ఆంధ్రదేశ ప్రశంస ప్రక్షిప్తమనికొందరు పండితులతలంపు.

**మహాభారతం :**

జటాసురో మద్రకానంచ రాజా
కుంతిః పుళిందశ్చ కిరాత రాజః
తథాంగవంగో సహాపుండ్రకేణ
పాండ్యోఢ్ర రాజౌచ సహాంధ్రకేణ ॥

సభాక్రియా పర్వమ్-సభాపర్వమ్-మహాభారతమ్.

ఆంధ్రాం స్తాలవనాంశ్చైవ కళింగా నుష్ట్రకర్ణికాన్.

దక్షిణ దిగ్విజయమ్.

మాళవాశ్చాంధ్ర కా స్తథా-

నిమంత్రిత రాజానుగమనమ్.

సంస్కృత మహాభారతమున సభాపర్వములో ఆంధ్రదేశపు ఉనికి చెప్ప బడినది. ఆంధ్రులు కౌరవ పక్షమున పోరాడినట్లు భీష్మద్రోణ, కర్ణపర్వములలో చెప్పబడినది.

---

అంగ వంగ కళింగాంధ్రా సింహ పుండ్రాంధ్ర సంజ్ఞికా
జజ్ఞిరే దీర్ఘతపసో బలేః క్షేత్రే మహీక్షితః
చక్రు స్స్వనామ్నా విషయాన్ షడిమాన్ ప్రాప్యగాం స్మతే.

భాగ. నవమస్కంధ. 23. అ.

మగధ చక్రవర్తి బలి యను వానికి అంగ, వంగ, కళింగ, సింహాపుండ్ర, ఆంధ్రులను, నాల్గురు పుత్రులుదయించి వారి వారి పేర్లతో రాజ్యముల నేర్పరచుకొనిరి.

---

కుంతలా ఆంధ్రా ఉద్భిదావన దారా

మార్కండేయ పురాణము

ఇట్లే బ్రహ్మాండ, వాయు, భాగవత పురాణములందాంధ్ర దేశ ప్రసక్తి యున్నది. ఆంధ్రవంశమున ముప్పది మంది రాజులు నాలుగు వందల ఏబది ఆరు సంవత్సరములు పాలించినటుల తెల్పబడినది.

---

ద్రవిడాంధ్ర మహారాష్ట్రా వైణ్యావైనాగ వాసజా

భరతుడు-నాట్యశాస్త్రమ్ (క్రీ. శ. 2. శ.).

దక్షిణాపథ రాజ్యాలలో ఆంధ్రరాజ్యం ఒకటి.

---

ఆగ్నేయాం దిశ కోసల కళింగ వంగోపవంగ జఠరాంగాః
శౌలిక విదర్భ వ్యత్యాంధ్ర చేదికాశ్చోర్ధ్వాం కంఠాశ్చ

బృహత్సంహిత - కూర్మ విభాగమ్.

బృహత్సంకిత కూర్మవిభాగంలో ఆంధ్రదేశ ప్రసక్తి వచ్చింది.

---

అన్ధ్ర పులిన్దేషు-సర్వత్ర దేవానాం ప్రియస్య

అశోకుని 13 వ ధర్మలిపి శాసనము

ఆంధ్రులు బౌద్ధధర్మ మవలంబించిరని గిర్నర్, షాహబాజ్‌గర్, కాల్సి యందు నెలకొల్పబడిన ధర్మలిపి శాసనములందు పేర్కొనబడినది.

---

జగన్నాథా దూర్ధ్వ భాగ మర్వాక్
శ్రీభ్రమరాంబికాత్ తావదంధ్రాభిధో దేశః

దేశనామావళి-శక్తి సంగమ తంత్రమ్.

శ్రీశైలంతు సమారభ్య చోళేశాన్మధ్య భారతః
తైలంగ దేశో దేవేశి ధ్యానాధ్యయన తత్పరః.

(శబ్దకల్ప ద్రుమమ్).

పురిజగన్నాథం ఉత్తరాన్న, శ్రీశైలం మధ్యన, దక్షిణాన్ని చోళదేశం- తెలుగు దేశానికి ఎల్లలు.

---

"అంధాపధీయో గామో విజీపఅమ్".

శివస్కందవర్మ-మైదవోలు శాసనము (3వ శతాబ్ది.)

"ఆంధ్ర మండలే ద్వాదశ సహస్రగ్రామ సంపాదిత
సప్తార్ధలక్ష విషయాధిపతే"

Ind. Anti. XV. Page 175.

నందివర్మ ముడియనూరు శాసనము.

క్రీ. శ. 3, 4, శతాబ్దముల నాటికి ఆంధ్రపథమని, ఆంధ్రమండలమని శాసనములందు పేర్కొనబడినది.

---

'ఆంధ్రాధిపతి'

మౌఖారి ఈశానవర్మ శాసనము క్రీ. శ. 554.
EI. XIV. P. 115.

6వ శతాబ్దికి విష్ణుకుండినులు పాలించిన దేశము ఆంధ్రదేశమని తెలియుచున్నది.

---

1. An...to...lo. (Andhra)

'Had a rich fertile soil with a moist hot climate, the people were of violent character, their mode of speech differed from that of mid-India, but they followed the same system of writing. There were twenty odd Buddhistic monasteries with more than three thousand brethern. Near the capital (pin...ki...lo) was a large monastery with a succession of high walls and storied terraces'

సారవంతమైన నేల, తడిపొడి శీతోష్ణస్థితి. ప్రజలు పరాక్రమవంతులు. కానీ భాష మధ్య హిందూస్థానం వారి భాషకంటె భిన్నమైంది. లిపి మాత్రం ఒక్కటే. ఇరవై బౌద్ధ సంఘారామాలు ఉన్నాయి, 3000 మతాచార్యులు ఉన్నారు. రాజధాని పిం. కిలో (వేంగి) వద్ద పెద్ద చైత్యం ఉంది. పైకి ఎక్కడానికి ఎత్తు గోడలు-వాటికి మెట్లు ఉన్నాయి.)
ధనకటకం తె. న. క. చి. క.)

Watters, Yuan Chwang.
Vol. II. p. 209.

---

## 2. Te...na...ka...chi...ka (Dhanakataka)

The country had a rich soil and yielded abundant crops. There was much waste land and inhabited towns were few. The climate was warm and the people were of black complexion, violent disposition, and fond of the ARTS. There was a crowd of Buddhistic Monasteries but most of them were deserted, about twenty being in use with one thousand brethern, mostly adherents of the Mahayanika System. There were hundred Deva Temples and the followers of the various sects were numerous'.

సారవంతమైన నేల. పంటలు పుష్కలంగా పండుతాయి. చాలా ప్రదేశం నిర్మానుష్యంగా ఉంది, పట్టణాలూ తక్కువే వేడి ఎక్కువ. ప్రజలు పరాక్రమవంతులు. కళాభిమానులు. ఎన్నో సంఘారామాలు ఉన్న అవన్నీ నిర్జనంగా ఉన్నాయి. ఇరవైయొక్కటి మాత్రమే సందడిగా ఉన్నాయి. వెయ్యిమంది బౌద్ధ భిక్షులు ఉన్నారు. వీరందరూ మహాయాన శాఖకు చెందిన వారు. నూరు దేవాలయాలు ఉన్నాయి. మతాంతరులు కూడా చాలామంది ఉన్నారు.

Watters, Yuan Chwang
P. 214 ff

"The Andhra kings appear to have maintained towards the cloze of their dynasty a constant intercourse with China and we find the Chinese government on one occasion sending an army to assist in putting down a rebellion in India"

ఆంధ్రరాజులు తమ రాజ్యాంతకాలమున చైనాదేశముతో నెక్కువ సంబంధము కలిగియుండెడివారు. చైనీయులు భారతదేశమున నొక తిరుగుబాటు నణచుటకు సైన్యమును పంపిరట.

Marshman : History of India. P. 36.

---

అత్రాంతరే ఆన్ధ్రనగరా దాగచ్ఛన్ బ్రాహ్మణః కశ్చిదైక్ష్యత ప్రాయాసిషం చదినైః కైశ్చి దన్ధ్ర నగరమ్ తస్యనాత్యాసన్నే సలిల రాశి సదృశస్య కలహంస గణదళిత నళిన దళ సంహతి గళిత కింజల్క శకల శారస్య సారసశ్రేణి శేఖరస్య సరస్తీర కాననే కృత నికేతన స్థితః

దండి-దశకుమార చరితమ్.

ఆంధ్ర నగరము - వేంగి, అచ్చటి సమీపసలిలరాశి - కొల్లేరు సరస్సు. (7. శతాబ్ది) దండి తన దశకుమార చరిత్రమున పేర్కొనినాడు.

---

"తైలంగదేశ కన్నడ దేశ మహారాష్ట్రీయ దేశ నవత్సావే"

చక్రధరుడు (1194).

మహానుభావ పంత్‌కి చెందిన చక్రధరుడు తెలుగు, కన్నడ, మహారాష్ట్ర దేశాలకు వెళ్లవద్దని ప్రబోధించాడు.

---

నర్మదాయ దక్షిణేన దేశోదక్షిణా పథః
తత్ర కర్ణాటక విషయాత్ పూర్వేణాంధ్ర విషయః

జయమంగళుడు - వాత్స్యాయన కామసూత్రవ్యాఖ్య (11. శతాబ్ది)

ఆంధ్రదేశం కర్ణాటక దేశానికి తూర్పున ఉందని జయమంగళుడు.

---

దేవ ప్రణమ్యతా

మయ మన్ధ్రి విషయం లక్ష్మ్యా స ప్తగోదావరీ హార
కలసైక నాయకో భగవాన్ భీమేశ్వరః

మురారి అనర్ఘరాఘవమ్. (9 వ శతాబ్ది)

మురారి 9 వ శతాబ్దమున సప్త గోదావరిని భీమేశ్వరుని పేర్కొని నాడు. 'సప్త గోదావరీభీమం' అని ప్రాకృత లీలావతి యందు కనబడుతున్నది.

---

గోదావరీ సరిదివోత్తుములై స్తరంగైర్
వక్త్రైస్స్ఫుటం సపది స ప్తభిరా పత న్తీ
శ్రీ కాన్త రాజ విపులాభి జనాబ్ధిమధ్యం
విశ్రాన్తయే విశతి రాజ తరంగిణీయమ్

కల్హణుడు-రాజ తరంగిణి. (1149)

రాజ తరంగిణి కావ్యంలోని ఏడు తరంగాలను గోదావరినది స ప్తపాయలతో కల్హణుడు పోల్చినాడు.

---

ఋవియును క్కణియా యాన్ట పొరుడన్దు పుల త్తిశ్రాగి
అవి యగత్తుల కడాంగి హైయె న్దిణై నెటి యళావి
చ్చవి యుఱ త్తెళిన్దు తణ్ణెన్టొళుక్కముం తుళువిచ్చాన్టోర్
కవి యె నక్కిడన్ద గోదావరి యినై వీరర్ కణ్డార్

(ఆరణ్య కాండ-శూర్పణఖపటలం)
కంబ రామాయణం.

భూదేవికి అలంకారం-శ్రేష్ఠమైన వస్తువులను పొలాలకు సమకూర్చేది, వేడిని పోగొట్టగల రేవులు కలదీ, అనేక ప్రాంతాల మీదగా ప్రవహించేది, చల్లనిది, పొంగే స్వభావం కలదీ, పెద్దలు చెప్పినకవితవలె భాసించేది-అయిన గోదావరిని పరాక్రమోపేతులయిన రామలక్ష్మణులు సందర్శించారు.

---

Next comes the Andar a still more powerful race, which possesses numerous villages and thirty towns defended by walls and towers and which supplies its king with an army of one lakh of infantry, two thousand cavalry and one thousand elephants.

Magasthenes J. W. Mac Crinddle,
Indian Antiquary,
Dec 1877 p. 339.

తర్వాత 'అందరే' (ఆంధ్ర) రాజ్యం బలవత్తరమైన జాతి-ఎన్నో పల్లెలు-ముప్పై పట్టణాలు పెద్దపెద్దగోడల ప్రాకారం, కోటలలో సంరక్షింపబడుతూ ఉంటాయి. అవి రాజుకి ఒకలక్ష కాల్బలాన్ని, 2 వేల గుర్రపు దళాన్ని, వెయ్యి ఏనుగులను ఆయత్తపరుస్తుంది.

---

The king of Vijayanagar has in his dominions three hundred ports, each of which is equal to Calicut...The country is for the most part well - cultivated, very fertile and contains about three hundred harbours. one sees there more than a thousand elephants; the troops amount in number to eleven lakh.

Abdur Razak. 15th Cen.
History of Andhra Commerce. p. 4.

విజయనగర సార్వభౌమునికి తన రాజ్యంలో 300 రేవు పట్టణాలున్నాయి. ఒక్కొక్కటీ కాలికట్ అంత ఉంటాయి. దేశం సారవంతమైంది. వేయి ఏనుగులు, పదకొండు లక్షల కాల్బలాన్ని అక్కడ చూడవచ్చు.

అబ్దుల్ రజాక్-15 వ శ.

The port of PULICAT was the eastern gateway for Vijayanagar commerce. It had a fair sea haven to which ships of Moors came in great number. It carried on trade with Pegu, Malacca, Sumatra and China in the East and Malabar and Cambaya in the west.

From Malabar and Cambaya, Pulicat imported vermilion and dyes required for its cotton cloth, Mecca velvets, rose water, quick silver and copper. From Pegu gold and Silver, rubies and musk were imported into Pulicat. From Ceylon and Kayal came some precious stones and pearls. In exchange for these, Pulicat exported its own printed cotton clothes manufactured locally to the eastern countries. There was also a large coastal trade in provisions.

Barbosa, 16 th Cen.
From History of Andhra Commerce
p. 4.

పులికాట్ విజయనగర రాజ్యానికి తూర్పువాకిలి. అక్కడ మంచి నౌకాశ్రయం ఉంది. అనేక మంది ఆఫ్రికావారి ఓడలు అక్కడకి వస్తాయి. తూర్పున పెగు, మలక్కా, సుమత్రా, చైనాలతోను, పడమట మలబారు, కాంబేలతోను వర్తకం జరుగుతుంది.

మలబారు, కాంబేలనుంచి కుంకంపువ్వు అద్దకం రంగులు (ముఖ్యంగా కలంకారీకి పనికి వచ్చేవి) మక్కా వెల్వెట్లు, రోజ్ వాటర్ పాదరసం, రాగి, పెగునుంచి [వెండి, బంగారం, కెంపులు, కస్తూరి, సింహళం, కెయాల్ నుంచి ముత్యాలు, విలువైన రాళ్ళు దిగుమతి అవుతాయి. వీటికి బదులు పులికాట్‌లో తయారయ్యే అద్దకం గుడ్డలు, కలంకారి గుడ్డలు తూర్పుదేశాలకు ఎగుమతి అవుతాయి. ఆహార సరుకుల వ్యాపారం ముమ్మరంగా సాగుతుంది.

బార్బోజా (16 వ శతాబ్దం).

Masulipatam is strangling town (Village), the houses in which are built of wood, and stand detached from one another. This place, which is on the sea-shore is renowned merely on account of its anchorage, which is the best in the Bay of Bengal, and it is the sole place from which vessels sail for PEGU, SIAM, ARAKAN, BENGAL, COCHIN CHINA, MECCA and HORMUZ as also for the islands of Madagaskar, Sumatra and the Manillas.

From. Travels in India
by Jean—Baptiste Tavernier,
Vol. I. Page 141...142,
1925 (1605...1665) 1651.

మచిలీపట్నం చెదురు మదురుగా ఉండే ఇళ్ళతో ఉంది. ఇళ్లు కర్రచెక్కలతో దూరందూరంగా కడతారు. బంగాళాఖాతం తీరంలో నౌకాశ్రయానికి మచిలీపట్నం రేవు ప్రఖ్యాత మయింది. పెగు, సయాం, అరకాన్, బెంగాల్, కొచ్చిన్ చైనా, మక్కా, హుర్మజ్, మడాగాస్కర్ దీవులు, సుమత్రా, మనిలా-దేశాలకు ఓడలు వెళ్ళే రేవు అదొక్కటే.

---

Land here (Visakhapatnam) is considered of so little value that every person who built took in as much ashe could employ — I bought some beautiful sandalwood and ivory boxes for which this place is famous.

'Original Letters ...
Mrs Fay. 3...3...1815
P. 219, Calcutta. 1968.

"విశాఖపట్నం: ఇక్కడ నేలకు ఏమీ విలువ లేదు. ఎవరి మట్టుకు వారు తమ శక్తికి మించకుండా స్థలాలను తీసుకొని కట్టుకొంటారు. ఇక్కడ చందనంతోనూ, దంతంతోనూ చేసిన పెట్టెలు కొన్నాను. వాటికి ఈ ఊరు ప్రసిద్ధికెక్కింది."

అతని ముళుదుణ్డు మయిరావ తుత్తున్
బవని తొళువార్ పడుత్తుం బువని
ఉరుద్దిణ నిన్నుడైయ ఓరంగ నాట్టిల్
గురు త్తిరా వాళై క్కుళామ్.

(కంబకవి చాటువు-ప్రతాపరుద్రుణ్ణిగూర్చి 13వ శతాబ్ది).

అవని అంతా నీ అతిథు లగుటవల్లనూ, ఐరావతంవంటి పట్టపు ఏనుగు మీద ఊరేగుతున్న నిన్ను చూచి మోహం పట్టలేక మదవతులు కింద పరుచుకొని శయనించుట వల్లనూ రుద్రా!. నీ ఒరంగల్లు నాడులో అరటాకులు కరవైనాయి.

---

ఆంధ్రీ ధమ్మిల్ల బంధాః సపది శిథిలయన్

రాజశేఖరుని కావ్యమీమాంస
పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి-పుట 370.

మలయమారుతం ఆంధ్రస్త్రీల కొప్పులను విడిపోయేటట్టు వీస్తూ ఉంది.

---

వాచో మాధుర్య వర్షిణ్యో వాథయః శిథిలాంశుకాః
దృష్టయశ్చ చలద్ భ్రూ కా మందనాన్యన్ధ్రి యోషితామ్.

భర్తృమేంథుడు.

ఆంధ్ర స్త్రీ వచో మాధుర్యాన్ని సంస్కృత కవి తన చాటువులో వర్ణించాడు. ఈ చాటువు సదుక్తి కర్ణామృతం అనే సంస్కృత సంధాన గ్రంథం నుంచి సేకరింపబడ్డది.

---

ఆంధ్ర నార్యోవరాః కాశ్చిద్ అపసవ్యోత్త రీయ కాః

మానసోల్లాసమ్ (1116)
(వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు-తెలుగు మెఱుగులు)

ఆంధ్రస్త్రీలు పైటను అపసవ్యముగా వేసుకొందురు.

కేశాః సపుష్ప గండూషా జఘనే మణిమేఖలా
హారో రక్తోజ్జ్వలం శుకం శుభ్రం వేషః స్యా దంధ్రయోషితామ్

మంకకుని కావ్యమీమాంస.

పువ్వులను పుక్కిలించే కొప్పు, మణిమయమైన ఒడ్డాణం రక్తహారం, తెల్లచీర-ఇదీ ఆంధ్ర స్త్రీ వేషాలంకారం.

---

ఖడ్గధేనుక మాంధ్ర ధానుష్కబలం

(పంప-ఆదిపురాణం. 13-45)

జైనుల ప్రథమతీర్థంకరుడైన భరతుని చరిత్ర ఆది పురాణం. అతని సేనలలో ఆంధ్రులు విలుకాండ్రుగా ఉండేవారని తెలుస్తుంది.

---

సుశోభన క్రమకరై
స్సేవితో జీవనార్థిభిః
మధ్యస్థ వాడబో రాజ
త్యాంధ్రదేశో నదేశవత్

ఈ ఆంధ్రదేశం సముద్రం లాంటిది. వాడబాగ్నిలా ప్రకాశించే మంచి నడవడిక గల బ్రాహ్మణులతో ఉంది. ఈ దేశంతో ఏదేశం సాటిరాదు.

---

ఆశ్రయితవ్యో నరపతి
రార్జయిత వ్యాని భూరి విత్తాని
ఆరబ్ధవ్యం వితరణ
మానేతవ్యం యశోదశస్వపి దిశాసు

రాజు నాశ్రయించి, ధనమార్జించి, దానాలుచేసి అన్ని దిక్కులా కీర్తి తెచ్చుకోవడమే ఇక్కడివారి నిష్కళంకమైన నియమం.

విశ్వగుణాదర్శం - వేంకటాధ్వరి - 221.

తెనుగు ప్రజలు ఆజానుబాహులు. స్ఫురద్రూపులు. తమిళుల కంటె చక్కటి వారు. ఎత్తులో ఔత్తరాహికులతో సమానంగా ఉంటారు. దాక్షిణాత్యుల కంటె ఆచార వంతులూ, శక్తివంతులూ కాని ఆవేశ పూరితులు.

భారతదేశ ప్రాచ్యదక్షిణ ఆసియా విజ్ఞానకోశము
3 వ. ముద్రణ. 1885.
'తెలుగు' క్రింద

——

'....They are taller and fairer than Tamils, otherwise they are of typical Dravidian features. They are enterprising people, good farmers and skilful seamen.'

The Encyclopaedia of
Britanica; Cambridge
1911. p. 577 under
TELUGU.

పోలికల్లో ద్రావిడ జాతికి చెందినవారయినా ఆంధ్రులు తమిళుల కంటె స్ఫురద్రూపులు. సాహసులు, మంచి కర్షకులు, నిపుణులైననావికులు")

——

The Telugus are a people quite as highly civilized as any in Europe, occasionally their mode of speech resembles those of Italy"

C. P. Brown : A Grammar of Telugu Language
P. 165 (1857)

తెలుగువారు ఐరోపాఖండ వాసులవలె నాగరికులు. వారిభాష చాలా మట్టుకు ఇటలీదేశపు భాషను పోలి ఉంటుంది.

——

The namudris themselves believe that most of them came from the land lying between the two great rivers, the Krishna and the Godavari. Tradition points to the same theory and the ancient books of Kerala confirm the popular belief, the accuracy of which may be verified by

a careful observer. There are so many points of similarity between the nambudris and their prototype residents of the Telugu Country from which they are said to have come.

Travancore Census Report
Vol. I. p. 654 as
quoted in Andhra Social
Life and Organisation.
1937.

కృష్ణా, గోదావరి నదుల నడిమి ప్రదేశాన్నించి వచ్చేమని నంబూద్రీలు నమ్ముతారు. కేరళ దేశంలోని ప్రాచీన గ్రంథాలు, ప్రజాసాంప్రదాయం ఈ నమ్మకానికి ప్రమాణంగా ఉన్నాయి. నిదానంగా ఆలోచించి నిజం తేల్చాలి. తెలుగు దేశపు ప్రజల కీ నంబూద్రీలకు చాలా పోలిక లున్నాయి.

తిరువాన్కూర్ జనాభా లెక్కలు
సం. 1. పుట. 654

---

The land has plenty of rice and Indian corn grains, beans and other kinds of crops, which are not sown in our parts, also an infinity of cotton.

Paes. 1530
from Andhra Commerce.

వరి పుష్కలంగా పండుతుంది. వరితోబాటు మనదేశాల్లో పండని పప్పుదినుసులు, చిక్కుళ్లు మొదలయిన ఇతరరకాలు ఇక్కడ బాగా పండుతాయి. పత్తికూడా బోలెడు.

---

tailanga, telingah or tilang is at once the name of a nation of its language and of the character, in which that language is written......andhri (script) used in Andhra Desa.

Alberuni's India, (A. D. 1014)
Sachan 1914 p. 173.

తైలంగా, తెలింగా, తిలాంగ్, జాతికి, భాషకి, లిపికి, పేరు. వారు వ్రాసే ఆ లిపిని ఆంధ్రి లిపి అంటారు.

---

This character, like the writing of Orissa is easily recognised by its loops and curves said to be due to the difficulty of writing straight lines with a stylus on a palm leaf without splitting the leaf.

The People of India
J. D. Anderson, p. 65. 1913,

తెలుగు లిపి ఓఢ్ర లిపిలాగే గుండ్రంగా ఉంటుంది. వుచ్చులు, వంకర లనుబట్టి సులభంగా పోలిక పట్టవచ్చు. గంటంతో అడ్డగీతలు గీస్తే తాటాకు చిరిగి పోతుంది. అందుకనే గుండ్రకత్తుగా లిఖించేవారు.

---

శకాభీర చండాల శబర ద్రమి లాంధ్ర జా ।
హీన వనేచరాణాంచ విభాషా నాటకే స్మృతా ॥

భరతుడు-నాట్యశాస్త్రమ్

నాటకానికి పనికివచ్చేవి ఏడు విధాలు. శకారి, ఆభీరి, చండాలి, శాబరి, ద్రామిడి, ఆంధ్ర, హీనులైన వనచరులు వాడే భాష.

---

యోవేత్త్యాంధ్ర మయీం వాణీం
శిరీష కుసుమ పేశలాం
కింతస్య సుధయా కార్యం
మాధుర్యరస నిర్ణయే

సుధాకర-(సదుక్తికర్ణామృతము నుండి).

ఆంధ్రభాష శిరీష కుసుమ పేశలమైనది మాధుర్య రసపూరితమును. (చూ. పెద్దన : మనుచరిత్రము : "సప్తసంతానములలోన" I-14).

మళలై క్కుఱు మొళిక్ సిలవడుగుం పలతమిళుం
కుళటి త్తరు కరునాడియర్ కుఱుగిక్కడై

(కళింగత్తుపరణి-జయగొండార్. 11. శ).

కన్నడుల మాటల్లో కొన్ని తెలుగు మాటలు, పెక్కు తమిళ శబ్దాలు చోటు చేసుకొన్నాయి

---

Among these five Languages, (Trilinga, Karnatic, Tamil, Malayalam and Singalese) the Telinga appears to be the most polished and though confessedly a difficult language. It must be numbered with those which are most worthy of cultivation, its variety of inflection being such as to give it a capacity of expressing ideas, with a high degree of facility, justness and elegance.

William Carey.
Grammar of Telinga
Language, 1814,
Serampur, Calcutta.

త్రిలింగ, కర్ణాటక, తమిళ, మళయాళ, సింహళ భాషలలో తెనుగు కష్టమైనభాష అని అంగీకరించినప్పటికీ అది సంస్కారయుతమైన భాష. నేర్చుకోదగిన భాషల్లో ఒకటి, రూపభేదంవల్ల భావాలను, సొంపుగా సౌలభ్యంతో చక్కగా వ్యక్తం చేయవచ్చు.

---

Few languages will be found more copious, more sonorous or more regular in constructions and it may boast, in a peculiar manner of great elegance of expression and melody of sound.

A. D. Campbell.
Teloogoo Grammar. (1816)

ఎవో కొన్ని భాషలు తప్ప, శబ్దసంపదలోను, శబ్దసౌష్ఠవంలోను, భావవ్యక్తీకరణంలోను, శ్రావ్యతలోను తెలుగుతో తక్కినవి సాటిరావు,

By reason of its musical flow Telugu has been called the Italian of the East. It deserves to be equally styled the English of the East on the ground that its vocabulary has been copiously recruited from the classical languages with which it came into contact as it passed through the process of development. So much has this been the case, that one would not be far wrong in holding that Sanskrit had lived after ceasing to be a spoken language by entering into Telugu and other vernacular languages so largelr and that barring HINDI, Telugu is the best specimen of Sanskrt simplified and popularised.

A. D. Campeell,
'Introduction to Telugu Grammar'.
3 rd Edn. Hindu Press, 1849.
1 st Edn. 1816.

వీనుల విందుగా ఉండబట్టి తెనుగును 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అన్నారు. తెలుగుభాష అభివృద్ధి అవుతున్నకొద్ది తనకు దగ్గరగా వచ్చే చాలా శబ్దజాలాన్ని ఆయా ప్రాచీన కావ్యభాషల నుంచి గ్రహించింది. కాబట్టి, ఇంగ్లీష్ ఆఫ్ ది ఈస్ట్' అనవచ్చు. దేశభాషల్లో సంస్కృతం ప్రవేశించిన తరవాత సంస్కృతం వ్యావహారిక భాషగా రాలేదు. హిందీ తప్పిస్తే సరళ సంస్కృతానికి, సులభ సంస్కృతానికి తెనుగుభాష ఒక ఉదాహరణ.

---

Gentoo is the language of this part of the country and one of the prettiest of all the dialects.

Letter from Madras, 1837
A Glossary of Anglo—Indian
Colloquial words and
Phrases. Yule and Burnell.
London 1886. Pp 280 . 281
2nd Edn. P. 369 (1968)

(ఈ ప్రదేశంలోని భాష జెంటూ అన్ని ప్రాంతీయ భాషలకంటె మధుర మైంది) Gentoo (జంటూ) అను పదమును సృష్టించిన వారు బుడుతకీచులు (Portuguese). ఈ శబ్ద పుట్టు పూర్వోత్తరాలను, చారిత్రకంగా, సమగ్రంగా డా. జి. మంగమ్మ Itihas అనే పత్రికలో విపులంగా వ్రాసారు (చూ. Itihas I. (2). 1975)

——

In respect of antiquity of culture and glossorial copiousness, Telugu is generally considered as ranking next to Tamil in the list of Dravidian idioms, whilst in point of euphonic sweetness it justly claims to occupy the first place.

Rev. Robert Caldwell.
Comparative Grammar
of Dravidian Languages
p. 25. Madras
1956 (1857)

ద్రావిడ భాషల్లో ప్రాచీనతకు, భాషాసంపదకు, తెలుగు, తమిళభాష తరవాత, చెప్పుకోదగ్గది భాషామాధుర్యంలో తెలుగు తర్వాతివే అన్ని భాషలు.

——

The Telugu people inhabiting the Northern Circars and the Nizam territory are also remarkable for their industry and their soft language, abounding in vowels, is the Italian of the East.

Modern India and Indians.
Monier Williams, 1878,
1st Edn. First Indian
Reprint 1971 p. 189

ఉత్తర సర్కారులలోని, నైజాం రాజ్యంలోని తెలుగువారు కష్టపడి పనిచేస్తారు. వాళ్ళ భాషలో అచ్చులు ఎక్కువగా ఉండటంచేత దీనికి 'ఇటాలియన్ అఫ్ ది ఈస్ట్' అన్న పేరు వచ్చింది.

Telugu is singularly melodious. It is the sweetest and most musical of all the Dravidian tongues, and it sounds harmonious even on the lips of the most illiterate. It has justly been called the 'Italian of the East'.

Henry Morris,
Simplified Telugu Grammar,
London 1890. P. I. 2

తెనుగు వీనులకు విందైనది. ద్రావిడ భాష అన్నిటిలోను మధురాతి మధురమైంది. నిరక్షరకుక్షి మాట్లాడినా శ్రవణానందకరంగా ఉంటుంది 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని అనడం సత్యసమ్మతంగా ఉంది.

—

TELOOGOO is the softest of all the Eastern Languages.

Manual of Administration
Madras. Vol. III. (1893)

(ప్రాచ్య భాష లన్నింటిలో తెలుగు సున్నితమైన భాష).

—

As a vernacular this (Telugu) is more widely spread and has a greater number of speakers even than Tamil.

Linguistic Survey of
India. p. 91. (1906)

దేశ భాషగా తెలుగు విశాలంగా వ్యాపించింది. తమిళంకంటె తెలుగు మాట్లాడేవారి సంఖ్యే యెక్కువ.

—

The Telugu or Telinga Language ranks next to Tamil among the Dravidian Languages in respect of culture and copiousness of vocabulary and exceeds it in

euphony. Every word ends in a vowel and it has been called the Italian of the East.

G. A. Grierson.
Linguistic Survey of
India. Vol. I. p 92
Reprint. 1967 (1906)

శబ్దసంపదలోను, సంస్కృతిలోను తెనుగు, ద్రావిడ భాషల్లో తమిళం తర్వాతిదే అయినా, శ్రావ్యతలో దానికంటె మించినది. ప్రతిపదం అజంతం. అందుకనే 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని అంటారు.

LANGUAGE.

---

Telugu is poorer in classical literature than its sister language, Tamil. BUT it certainly bears the form for its exquisite grace and melody. On account of its sweetness of sound it is aptly called 'The Italian of the East'

A Manual of Telugu Grammar
and Phonetics. p. 7 1918

కావ్యభాషా సంపదలో తన తోబుట్టువైన తమిళంతో తీసిపోయినా, మనోహరమైన నడకకి, శ్రావ్యతకి తెలుగు పైచేయి. తీయనైన ఆ భాషా మాధుర్యాన్నిబట్టి తెలుగును 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అన్నారు.

---

Telugu can be looked upon as the northern most member of the southern Languages or the southernmost member of the northern Languages.; and it has the advantages of both groups with few, if any, of the defects. It is adaptable, dynamic, absorbtive, grammatically simple and euphonically exceptionally beautiful even when using foreign words. It has never suffered from narrow provincialism.

G. Homefield Mc Leod.
in his letter to the Editor;
The Hindu dated 16th July, 1958.

తెలుగు-ద్రావిడ భాషా కుటుంబంలో ఉత్తరాదిభాష, ఆర్యభాషా కుటుంబంలో దక్షిణాది భాష. రెండింటిలోని లక్షణాలు కొద్దిగా లేకపోలేదు-ఏవో కొలది అవలక్షణాలతోపాటు తెనుగు పొందికకలది. శక్తివంతమైనది. ఇతర భాషలను తేలికగా తనలో కలుపుకో గలదు. వ్యాకరణసౌలభ్యం కలది.

సహజంగా శ్రవణానందంగా ఉంటుంది-అన్యదేశ భాషాపదాలు ఉపయోగించినా. తెనుగు ఔదర్యంతో అన్ని భాషలను స్వీకరిస్తుంది. దానికి సంకుచితత్వం లేదు.

——

But should the period of English dominance end tomorrow and the Andhras form their own Government, they must make an attempt to conduct their own affairs in their own language.

Introduction to Telugu
Dictionary... R. callettill.
p XI. OUP. 1935.

బ్రిటిష్ పరిపాలన అంతమయి ఆంధ్రులకి ప్రత్యేకరాష్ట్రం ఏర్పడ్డప్పుడు, వారి భాషలోనే వారి పాలనా వ్యవహారాలను సాగించడానికి ప్రయత్నం చేయవలసి ఉంటుంది.

——

You cannot keep out foreign words as you keep out foreign manufactured goods. Perhaps Telugu accepts them more easily than any other Indian Language and this certainly helps to make it a rival to Hindi in teaching Science, Medicine and Engineering.

J. B. S. Haldane...'The Hindu'
dated 27. 4. 1958.

'విదేశ వస్తువులను బహిష్కరించినట్లు అన్యదేశ్య పదాలను బహిష్కరించలేం. భారతీయ భాషలన్నిటిలోను అన్యదేశ భాషాపదాలను తెలుగు

గ్రహించినంత సులభంగా ఏ భాషా స్వీకరించలేదు. కాబట్టి ఎన్నటికైనా విజ్ఞాన శాస్త్రం, వైద్యం, ఇంజినీరింగ్ మొదలయిన వాటి బోధనలో హిందీకి తెలుగు ప్రతిస్పర్థి కాగలదు.'

---

చోళీపయోధర ఇవ ప్రకటో నకామం
నో ఘూర్జరీ స్తన ఇవాతి తరాతి లీనః
అర్ధోగిరామపి హితః పిహితశ్చ కించి
దాంధ్ర పయోధర ఇవాతి తరాం సమింధే

చాటువు.

ఘనతర ఘూర్జరీకుచ యుగక్రియ గూఢముగాక, ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక, యరచాటగు నాంధ్ర వధూటి చొక్కపుం
జనుఁగవఁబోలి గూఢమును జాటుదనంబునుగాక యుండఁ జె
ప్పిన యదిపో కవిత్వ మనిపించు నగిం చటుగాక యుండినన్.

(పంచతంత్రం – వేంకటనాథకవి 1–18)

---

ఇక్షుచ్ఛాయే కిసలయమయం తల్పమాత స్థుషీణాం
సల్లాపై స్తైర్ముదిత మనసాం శాలి సంరక్షకాణాం
కర్ణాటాంధ్ర వ్యతికరవశాత్ కర్బురేగీతి భేదే
ముష్యాంతీనాం మదనకలుషం మౌగ్ధ్యమాస్వాదయేథాః,

హంస సందేశం–వేదాంత దేశికులు. (14. శ.)

(పువ్వుపాన్పులమీద, తియ్యమామిడిచెట్ల కింద ముచ్చట లాడుకొంటూ తెలుగు పల్కులు కన్నడపు నుడులతో హాయిగా పాటలు పాడుకొంటూ వరి పంటలకి చేలకాపుగా ఉండే అందమైన ముగ్ధాంగనలు చూడవలసినవారు సుమా!)

---

సింధు నదియిన్ మిశై నిల వినిలే
చేర నన్నాట్టిళం పెన్‌గళుడనే

సుందర తెలుంగు నిఱ్పాట్టి శైత్తు
త్తోణిగ ళోట్టి విళైయాడి వరువోం

పండవారిన వెన్నెల రాత్రిలో, చేరదేశపు చెలులు దగ్గర ఉండగా, చక్కటి తెలుగుపాట పాడుతూ, సింధు నదిని పడవ నడుపుదాం.

(సుబ్రహ్మణ్య భారతి - భారతదేశం).

——

The poses of the ladies in this subject (Amaravati) show a striking resemblance to those of the wall-paintings of Ajanta, and a comparative study of the sculptures of Amaravati and the paintings of former place reveals the fact that the Art of Ajanta is essentially Andhra both in feeling and technique.

FINE ARTS. The
Early History of
The Deccan. Vol. II.
Ed. G. Yazdani·
p. 749. OUP.

(అమరావతీ శిల్పసుందరులకీ, అజంతా చిత్ర సుందరులకు అప్పచెల్లెళ్ళ పోలిక. కాబట్టి అజంతా చిత్రకళ అచ్ఛంగా ఆంధ్రులది-భావంలో భంగిమంలో)

——

"It has only been as yet imperfectly explored, but from what we now know of it, there can be no hesitation in asserting that its sculptured details are more extentise and more interesting than those of any other Buddhistic monuments in India, and a higher class of art that has yet been found anywhere".

J. Ferguson: Amaravati
Royal Ariatic Society Journal of
Great Britain a Ireland. Vol III.
New Series Pages 132-165. (1868)

ఇప్పటి వరకు పరిశీలించిన శిల్పకళా ఖండాలన్నిటిలోనూ ముఖ్యంగా భారతీయ బౌద్ధశిల్పాలన్నింటి లోను, అమరావతీ శిల్పకళ ఉత్తమకళ అని చెప్పడానికి—ఏమీ అభ్యంతరం లేదు.

———

"The local development, in the south, of the early phases of the Indian Art was indeed a valuable contribution made by the artist of the Andhra Desa and it will be reasonable to support, by sculptures of the Andhra tribe"

Andhra Sculpture-O. C. Gangooly. Page 18 (1973)

దక్షిణభారతంలో పెంపొందిన భారతీయకళాభివృద్ధికి ఆంధ్రులుచేసిన సేవ గణనీయమైంది. దానికి ఆంధ్రశిల్పులే ప్రధానకారకులని చెప్పవచ్చు.

———

The pronunciation of Samskrt among the Teloogoos corresponds with the purest pronunciation at Benaras, (varanasi).

Madras Manual of Administration
Madıas. Vol. III. 1893.

(తెలుగువారి సంస్కృతోచ్చారణ కాశీవాసుల స్వచ్ఛమైన ఉచ్చారణతో సమానంగా ఉంటుంది.)

మద్రాసు మాన్యూయల్ ఆఫ్
ఎడ్మినిష్ట్రేషన్
౩ సం. 1893.

———

The rule of a Telugu Dynasty over a Tamilian kingdom with such cultural and other benefits to the land is indeed a most striking and creditable feature, in the

History of South India, and forms a most pleasing echo of vigorous and continuous cultural growth.

Prof C. S. Srinivasa Chari.
Introduction to the
Nayaks of Tanjore.
Annamalai University
Publication. 1943.

తమిళ రాజ్యంలో తెలుగువారి పరిపాలన సాంస్కృతిక సమగ్రమైనది. దక్షిణభారత చరిత్రలో శాశ్వతమై, ఆనంద జనకమైన అధ్యాయాన్ని సృష్టించింది.

తంజావూరి నాయకరాజుల
చరిత్రకు ఉపోద్ఘాతంలో
ప్రొఫెసర్ సి. యస్ శ్రీనివాసాచారి (1943)

---

The best painted clothes were to be had at PULICAT belonging to Vijayanagar, Nizampetam or Petapoli. Masulipatnam is quite the most famous market on the coast.

Schorer (1609. 1614)
Dutch Factor.

విజయనగర రాజ్యంలోని పులికాట్‌లోను నిజాంపట్నం (పెదపల్లి)లోను నాణ్యమైన అద్దకం గుడ్డలు దొరుకుతాయి. మచిలీపట్టణం ఈ తీరంలో ఈ వ్యాపారానికి పెట్టింది పేరు.

షోరర్ (1609-1614)
డచ్. ఫాక్టర్.

---

After mentioning the Town of St. Thomas he next describes the kingdom of Motphile (Motupalli, near Chirala, Prakasam Dt).

It is in this kingdom that diamonds are got. No other country but the kingdom of Motphile produces them ... .. In this kingdom are also produced the best and most delicate buckrams, and those of the highest price in south, they look like tissue of the spider's web.

Report on the old Records
of the India Office, 1891.
Pp. 127., 128.

శాంథోమ్ తరవాత మార్కపోలో మోటుపల్లిని వర్ణించాడు. అతని మోటుపల్లి వర్ణన

ఈ రాజ్యంలోనే వజ్రాలు దొరుకుతాయి. ఒక్క మోటుపల్లి రాజ్యమే వాటిని సేకరిస్తుంది. ఇక్కడే మహోన్నితమైన నాణ్యమైన, ఖరీదైన మైనపు గుడ్డలు (కాలికో) తయారవుతాయి. సాలీడు గూడులోని సన్న పోగంత సున్నితంగా అవి ఉంటాయి (కాకతి రుద్రాంబ పాలించే రోజులు)



The paintings of this coast of Coramandal are famous throughout India and are indeed the most exquisite that are seen. The best wrought, all with the pencil and with such durable colours that, not withstanding they be often washed, the colors fade not whilst the cloth lasteth; and this happeneth principally by a plant which growth only in this country called by them *chay* which dieth or stainet a perfect red.

The cloth plain and patterned, the muslins were best woven in and around Warangal and Persia took much for turbans and girdles.

Big and good ships were built here especially at Narsapur and with these ships Andhras traded with the

Red Sea and the East including the Archipelago besides along the coast.

W. Methwold, 1618...1622
at Masulipatnam.
English Factory Records.

భారతదేశం అంతటా కోరమండల్ తీరంలో తయారయ్యే కలంకారీ గుడ్డలు ప్రఖ్యాతి చెందాయి. ఎంత ఉతికినా దానిపైన ఉన్న పనివాసితనం; రంగులు, పాడవవు. బట్ట ఉన్నంతకాలం రంగు ఉంటుంది. ఈ రంగు కావలసిన ఛాయావృక్షాలు ఇక్కడ బాగా ఉన్నాయి.

వరంగల్ చుట్టుపట్ల రవశల్లాలు బాగా నేస్తారు పర్షియా దేశం తల పాగాలకు, పరికిణీ గుడ్డలకు ఎక్కువ భాగం కొంటుంది.

పెద్దవి, బలమైనవి అయిన ఓడలు నిర్మిస్తారు–ముఖ్యంగా నర్సాపురంవద్ద అటూ ఎర్ర సముద్ర దేశాలతోను, ఇటు ప్రాచ్యదీవులతోను ఆంధ్రులు ఈ నౌకలమీదే వ్యాపారం చేస్తారు

---

Much common cloth, all kinds of muslins and mallow cloth and other merchandise brought there locally from the regions along the coast .. about these places is the region of Masalia, stretching a great way along the coast before the inland country, a great quantity of muslins is made there.

Periplus of Erythrean Sea.
(Form History of Andhra Commerce) p 2

తీరప్రదేశాల నుంచి సాధారణమైన బట్టలతోపాటు, అన్ని రకాల రవశల్లాలు, పువ్వుల గుడ్డలు ఇంకా కొన్ని వాణిజ్యపు సరకులు ఇక్కడికి తెస్తారు. ఇక్కడే మసాలియా (మచిలీపట్టణం) ఉంది. ఈ చుట్టుపట్ల ప్రదేశంలోనే భారీ యెత్తున రవశల్లాలు నేస్తారు.

పెరిప్లస్

They built some ships much larger than ours capable of containing two thousand butts, and with fine sails and many masts.

Nicolo Conte
1419

History of Andhra Commerce. p. 4

మన ఓడలకంటె పెద్దపెద్ద ఓడలను నిర్మిస్తారు. 2000 పీపాలు ఒక్కొక్క దానిలో పడతాయి చక్కని తెరచాపలు, ఎన్నో ఓడ స్తంభాలు ఉంటాయి.

——

The well known traveller BERNIER (1656—68) was in Agra and described the tent in the throne hall at Agra.

'The outside of this magnificent tent was red, and the inside was lined with elegant Masulipatam chintzes, figured expressely for that very purpose with flowers so natural and colour so vived that the tent seemed to be encompassed with real gardens.

"సుప్రసిద్ధ యాత్రికుడు బెర్నియర్ (1656-68) ఆగ్రాను సందర్శించినప్పుడు రాజభవనంలో ఉండే ఒక గుడారాన్ని ఇట్లా వర్ణించాడు.

ఈ బ్రహ్మాండమైన గుడారం పై భాగం అంతా ఎరుపు లోపటి లైనింగు మచిలీపట్టణం కలంకారి దానిరంగు, స్వచ్ఛంగా అద్దినపువ్వులు చూస్తే చుట్టూ పూలతోటలా ఉంది."

——

Goods from this coast suit French and continental tastes.

Voltaire, the French Philosopher speaks of, 'The loveliest printed fabrics of Masula'

The History of Andhra
Commerce p. 6

ఈ తీరంనుంచివచ్చే సరుకులు ఫ్రెంచివారికి, యూరపు భూఖండవాసులకు వారివారి అభిరుచులకు అనుగుణంగా ఉంటాయి. అత్యంత మనోరంజకములగు మచిలీపట్నం కలంకారీగుడ్డలు అని ప్రఖ్యాతఫ్రెంచి తత్త్వవేత్త వాల్టేరు అన్నాడట.

---

ఆంధ్రత్వ మాంధ్ర భాషాచ
ప్రాభాకర పరిశ్రమః
తత్రాపి యాజుషీశాఖా
నాల్పస్య తపసఃఫలమ్

అప్పయదీక్షితులు.

ఆంధ్రత్వము, ఆంధ్రభాష, భట్టప్రభాకరుని పాండిత్యము, అందులో యాజుషీశాఖలో పుట్టడము తపఃఫలము ఇదియే దీక్షితులవారి చరమవాంఛ.

---

The Andharas are a virile people proud of their traditions. they are devoutly religious people, capable of sacrifice. Much is expected from them by the country. Andhra Desh is full of vigour. Her people are strong, powerful, insistent, generous and loving.

Mahatma Gandhi,
Young India,
April 13, 1921

ఆంధ్రులు శౌర్యవంతులు; గర్వకారణమగు సంప్రదాయము కలవారు మతరీత్యా శ్రద్ధాభక్తులు గలవారు త్యాగ శీలురు. దేశమునకు గొప్ప శ్రేయస్సును కూర్చెదరని అభిలాష కలదు. ఆంధ్రదేశము వీర్యవంతమైనది. అచటి ప్రజలు బలిష్ఠులు, శక్తిమంతులు, పట్టుదలగలవారు, దానశీలురు, ప్రేమ కలవారు.

మహాత్మాగాంధి.

卐